# భారతి ముప్పది ఆరవ సంపుటము

## అ కా రా ది వి ష య సూ చి క

# భారతి ముప్పది ఆరవ సంపుటము

## అకారాది విషయ సూచిక

# విషయానుక్రమణిక

## డిశంబరు 1959



## జనవరి సంచికలో

# వార్తలు

## శ్రీ సంజీవరెడ్డికి కాంగ్రెస్ అధ్యక్షపదవి

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షునుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు. ఆయనతో పోటీచేయదలచినవా రందరూ నామినేషనులు ఉపసంహరించుకున్నారు. శ్రీ రెడ్డిగారిపేరును శ్రీమతి ఇందిరాగాంధీ, పంత్, మొరార్జీలు ప్రతిపాదించారు.

## చైనా చర్యపై అమెరికా ఖండన

చైనా ఇండియా సరిహద్దువివాదంలో ఇండియావాదం, హక్కులు సక్రమమైనవని అమెరికా అభిప్రాయపడుతున్నట్టు అమెరికా విదేశాంగమంత్రి శ్రీ క్రిస్టియన్ హెరర్ నవంబరు నెలలో వాషింగ్‌టన్‌లో ఒకపత్రికా ప్రతినిధులగోష్ఠిలో అన్నారు. చైనా బలప్రయోగం చేసిందని ఇది చాలా తప్పని ఆయన అన్నారు.

హెర్టర్ ప్రకటనపై అమెరికాలో పెద్ద గాలిదుమారం రేగింది దానిపై హెర్టర్ భారత రాయబారి కార్యాలయం ప్రతినిధిని పిలిపించి తన ప్రకటనను విశదీకరించాడు.

## కాంగ్రెసు అధిష్ఠానవర్గం తీర్మానం

చైనా - భారతదేశాల సరిహద్దు వివాదం విషయంలో భారతప్రభుత్వం అనుసరించ నిశ్చయించిన విధానాలను, క్లిష్టపరిస్థితిని ఎదుర్కొనడానికి జరుపుతున్న చర్యలను కాంగ్రెసు అధిష్ఠానవర్గం నవంబరు 10వ తేదీన బలపరుస్తూ తీర్మానించింది. తగినచర్యలు తీసుకోవాలని, అయితే, అలాటి చర్యలవల్ల భారతదేశపు అఖండత్వానికి భంగం కలుగరాదని, ఏవిధంగాను దురాక్రమణను అంగీకరించినట్టు కాకూడదని ఈ తీర్మానంలో స్పష్టపరచబడింది.

## శ్రీ కురుగంటి సీతారామయ్యగారి మృతి

సుప్రసిద్ధ పరిశోధకులు, విమర్శకులు శ్రీ కురుగంటి సీతారామయ్యగారు నవంబరు 4 వ తేదీన నాంపల్లి (హైదరాబాద్)లోని స్వగృహంలో మరణించారు. వీరివయస్సు 70 సంవత్సరాలు. వీరు నవ్యాంధ్ర సాహిత్యవీధులు, తంజాపురాంధ్రనాయకచరిత్ర మున్నగు గ్రంథాలు రచించారు. నవ్యసాహితీ సమితి మాజీ అధ్యక్షులు. పారిభాషికపదకోశ సంఘ సభ్యులు. వీరు లోగడ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. నిజాం కాలేజీలో ఆంధ్రోపన్యాసకులుగ వున్నారు. తర్వాత, ఉస్మానియా విశ్వవిద్యాలయ తాళపత్రగ్రంథాలయంలో పరిశోధకులుగా ఉన్నారు.

## కూచిపూడి బృందం పర్యటన

కేంద్రప్రభుత్వం శాస్త్రపరిశోధన, సాంస్కృతిక వ్యవహారశాఖ అమలుజరుపనున్న పథకం ప్రకారం ఆంధ్రప్రదేశ్ నుండి కూచిపూడి నాట్యనటకబృందాన్ని కేరళ-మైసూరు రాష్ట్రాలలో పర్యటనకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పంపించనున్నది.

## అజాద్ కాశ్మీర్ మాజీ అధ్యక్షుని అరెస్టు

అజాద్ కాశ్మీర్ మాజీ అధ్యక్షుడు సర్దార్ మహమ్మద్ ఇబ్రహీం రావల్పిండిలో పాకిస్తాన్ సైనిక శాసనం కింద అరెస్టు చేయబడ్డాడు. ప్రభుత్వంపై అసంతృప్తిని, విద్వేషాన్ని రెచ్చగొడుతున్నాడన్న ఆరోపణపై ఈ అరెస్టు జరిగింది.

## తూకేర్ గ్రామం విముక్తి

అస్సాం-తూర్పు పాకిస్తాన సరిహద్దులో ఉన్న భారతగ్రామం తూకేర్ గ్రామం 14 మాసాల తర్వాత నవంబరునెలలో మరల భారతదేశం అధీనంలోకి వచ్చింది. దీనిని లోగడ పాకిస్తాన్ పెద్ద కాల్పులు సాగించి ఆక్రమించుకొన్న విషయం పాఠకులకు విదితమే. రాడ్‌క్లిఫ్ అవార్డు ప్రకారం మరికొన్ని గ్రామాలపై అధికారం కూడా ఇండియాకే సంక్రమించింది.

## ఇండియాకు చెకోస్లోవాకియా ఋణం

భారతదేశంలో పరిశ్రమల అభివృద్ధి కోసం చెకోస్లోవాకియా భారతప్రభుత్వానికి 28 కోట్ల రూపాయలు ఋణమివ్వడానికి ఒడంబడిక జరిగింది. దీనిపై భారత పరిశ్రమలమంత్రి శ్రీ మనూభాయిషా, చెకోస్లోవాకియా విదేశ వ్యాపారశాఖామంత్రి ఎఫ్. క్రాసిర్ సంతకాలు చేశారు.

# విశ్వనాథ మధ్యాక్కఱలు: శ్రీగిరి శతకము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఎదలోని బాధకు భావనాదీప్తికెల్ల విరామ
మొదవిన యెచ్చోటనో నిరాకార మూని యుందువని
మది నమ్మఁజాలనిఁక భావతీవ్రత మదిలోని నొవ్వు
సాద నీవు తోఁప శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

ఇదికాదటంచు నా బ్రదుకు నేను యథేచ్ఛంబుగాఁగ
బ్రదుకుచు మరి మధ్యమధ్య నీవు కన్పడవంచుఁ దెనుగు
పదములు వ్రాయుచు నాటకంబుగా భావింతువేమొ
సుదతీకృతార్థ శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

నా నమ్మకమ్మిది స్వామి నాథ నాదు జన్మాదులచేతఁ
బూని తా నియమితమయ్యె వాసుకిభోగికేయూర
దీనిచే నిన్ను భావింతు నైరమ్మనీయమా నరసి
పోనవుగాఁగ శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

నీలలోహిత ప్రొద్దుక్రుంకినంతనే నీ వా వెనుకను
వ్రాలివత్తువని మెఱుంగుదున యమ్మవారి వా నగలు
వ్రాలుచందురురేక శుక్రగురువుల బావిలీల్ పాప
సూలచేకట్లు శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

ఒనర్రైనయంతలో నా మన స్స్ఫూరియూరియున్నయది
వనితాధనోహాలే యుప్వకార మావయు నూని యనగ
తనర బండనువేసి రాచినం బోదు దానిలక్షణము
సాన తావిచెడదు శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

పిచ్చి తాఁ గుదిరినఁగాని యోస్వామి పెండిలి కాదు
పిచ్చి తాఁ గుదురదు ప్రాణనాయక పెండ్లైనఁగాని
హెచ్చి నిన్నూహింతు మనసుచేశనే యిది చావ దీవు
చొచ్చినఁగాని శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

చెట్ట యీ మనసున కయ్యె సిగ్గువచ్చియు సిగ్గురాదు
పట్టినచోటనే పాముకరచియుఁ బట్టు నచ్చోటె

చుట్టపెట్టి పాఱింపు నీవని మఱుగుచొచ్చితి నాత్మ
చుట్టమనంచు శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

ప్రళయాంబు లెన్నైనఁ గడచుదాఁక మార్కండేయునట్లు
ఇలమీఁద నుంచుమమంచంటినా జన్మ లింకేమి నాకు
వలదంటినా నాదుతలఁపులో నీవు వచ్చి నిల్చింటి
చులుకచేసితినో శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

అనుభవస్మృతిఁగాక పెద్దసుఖము లేదనుభవవేళ
ననుభవవేళయందు సుఖ మన్నచో నదియు భావనయు
పవిత్రభావన కింత హేయమ్ముప్పమా పరికరణవేలో
చొనిపినా వీవు శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

నమ్మితి నుపనిషదర్థముల్ నిన్ను నమ్మితి నిన్ను
నిమ్మియు నమ్మనో నీవు చేసినది యేమియు లేదు
నమ్మినట్టు చేయువాఁడరయ్యా యీ నాకు నిమ్మనన
సామ్ములు నివి శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

ఏవేళ నినుఁ జూచినానో యావేళ నీకుండెకాయ
కావు చేసితి గంగుమారి వ్యాకమ్ముకడఁ జొక్కపాడిచి
సేవింపఁగా నీవు నెంచవేలో వచ్చి మ రిందు కలిమి
కూడె మిక్కిలిగ శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

ఒకవేళ నేనెఱుంగకయ సేవించుచుంటి వేమో యు
యకదంబ! సేవించనట్లుగ నభినయంబు సేయుచుచు
ముకుపుటంబునఁ బెట్టి యాఘ్రాణము జేయుదేమొ
సుకుమారమూర్తి శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

నీ వంతరాత్మలో నిలచి పలికిన నిగుడుయత్నంబు
దేవి శారదగ భాసించె నా దేవి దేవ! భవత్కృపా
పావృష్టిఁ దగు నాదు జిహ్వాగ్రముఁ బైకిఁ బ్రాఁకిన నచట
కూడె నీయునికి శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

పరగ నా శారదా దేవి నీనుండి బయలు దేరినది
సరసిజభవురాణి యొక్క ధార నాసన్నిధిఁ బ్రాఁకె
హర! నన్ను నా ధారవెంట నీవద్ద కరుదేర నీవె
సురనదీచూడ! శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

# శాకుంతలము: రవీంద్ర కవీంద్రుడు

శ్రీ నేలటూరి రామదాసయ్యంగారు

ఇప్పటికి ఇంచుమించు రెండేండ్లక్రిందట ప్రకటితమగు మదీయ శాకుంతల రసాస్వాదినిని శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి చేత నంపితిని. ఆయన నిజాభినందనమును తెలుపుచు, మహాకవి ఠాకూరుగారి శాకుంతల పరామర్శలును పరామృష్టములై నవికదా అని యడిగెను. అంగులకు నేను వారి పేరు కూడ ఉదాహరింపబడియే యున్నది అని యంటిని. అట్లే గదా,—'అది (శాకుంతలము) సాహిత్యం గోలిగిన తొంటి యాచార్యులగు ఆనందవర్ధనాభినవగుప్తాదులయు నేటివారగు అరవింద ఘోషు ఠాగూరు కవీంద్రాదులయు బహుమానపూర్వక పరామర్శల నందియున్నది.' అని. (రసాస్వాదిని—ఉపోద్ఘాతము–పుట–1) ఐనను రవీంద్ర శాకుంతల విమర్శను అంతయు కాని నేను అంతకన్నను ప్రస్తావించిన వాడను గాను. అట్లు ప్రస్తావింపమి "వృద్ధా స్తే, న విచారణీయచరితా స్తిష్ఠన్తు కిం వర్ణ్యతే?" "పెంగురు జ్యాయసుల్ తపుడ నొప్పరు వారి చరిత్ర, యుండనీ" అను లబ్ధవాక్య న్యాయమున నే.

రవీంద్రుని శాకుంతలప్రశంస సర్వమును యూరపు జర్మను కవిసహృదయచక్రవర్తి గేటే పలికిన చిన్న ప్రశంసాగీతికకు తన విపులవ్యాఖ్యనే అద్దెను. గేటే గీతికను ఇది ఆంగ్లానువాదము

Wouldst thou the young years' blossoms and the fruits of its decline,

And all by which the soul is charmed, enraptured, feasted, fed?

Wouldst thou the earth and heaven itself in one sole name combine?

I name thee Sakuntala, and all at once is said.

"నీవు బాల్యపు (ఎలజవ్వనపు) కుసుమములు కావలయునా, అగలితపు వీడిపోయిన నాటి ఫలములం గావలయునా? అంతియ కాక, ఆత్మ యెవని సంతసించు గొనునో, సుఖపరవశ మగునో, పరిపుష్టి గనునో, విందారగించునో అట్టి యెల్లను గావలయునా? మన్ను మిన్ను—భూమియు స్వర్గమును ఒక్క (పేరి) టనే కలుపం గోరెదవా? ఈ యన్నింటికిని, ఓ శకుంతలా, నిన్నే నే పేర్కొందును. అంత సర్వమును నొక్కమ్రాటి చెప్పబడిన దగును, చరితార్థమగును" ఇది దానికి ఒకపాటి ఆంధ్రానువాదము. గేటే యీ శాకుంతల ప్రశంసకు కారణము నేను ఒకడుగా ఊహించి ఆ రసాస్వాదినియందు ఇట్లు తెలుపుకొనియుంటిని. "ఉదాత్తవృత్తుడగు (షేక్స్పియరు నాటకగత) రసాభాసాదిదగ్ధత్రీలందు, తన్మాహాత్మ్యములందు, రచన మున్నను భావముల యెత్తుగల 'గంభీరతరము' కాని, పరనిర్వృతికర లలితలాస్యము లేదు. అట్లే నాటకీయ యుదాత్తతోన్నతియు. కావున గేటే, మహాకవి హృదయచక్రవర్తి గేటే తన భావకుడుగాను సాక్షాత్తు దేవుడుగాను తోచి, తన చిత్తమున కుదిరి శాంతముగ ని ఆరాధనచేసి స్తోత్రము లందిన షేక్స్పియరుగన ఆ తోంటవానికి మిక్కిలి అబ్బురపడుమనే ఉత్సాహము బొంది కాళిదాసు శాకుంతలములోని చల్లని యీ 'లాస్యమునకు' సంతసపడి దానిని ఇట్లు వాంగ్గాంధియుం బొరయించినాడు—'Wouldst thou' ఇత్యాది. ఇంతియు వానిగింటి యూగ్లింకూడి మాట భోగింపినటు గాక, హిమవత్సింధుక్షేత్రియు అతిదూరదేశవాసినియు, పరిశుద్ధశీలయు. తనయొక్క మర్యాదగా నచ్చిన లింగము అట నాగరికసంజ్ఞ శకుంతల ను ఒకపాటి ఉపమముగా మడిగా ఉంచి చూచి ప్రముక్కిడియే చేసనది యీ స్తోత్రపాఠమని తలంతురు కాబోలు' అని మతి ఠాకూరు కవీంద్రనాథుడు గేటే ప్రశంసాగీతికపై ఇటు వ్యాఖ్యానించుచున్నాడు. 'మనకు ఈ ప్రశంసను వటి కరవపు బొందు అని పానితును. దాన గేటే శాకుంతలమును మిక్కిలి అందమైన కావ్యముగా ఎంచెనని తలంతుము. కాని, నిజముగా అది యట్లు గాదు. అతని పద్యము వటి యూనంద పారవశ్యపు కొమ్మకోలను అతిశయోక్తియు గాదు. మతి విమర్శకుని లెన్నగా అరచి చెప్పిన నిజనిర్ణయము. ఆ మాటలలో ఒక ముఖ్యమైన నిర్దేశము గలదు. శాకుంతలమున ఒక క్రమవృద్ధిని మార్పును సూచిన

చరిత్ర స్పష్టముగా తోచి ప్రకాశించును అని ఆయన చెప్పుట—పూవు పెరిగి కాయగా మారుట, భూమియు స్వర్గముగా పరిణమించుట, అచిత్తు చిత్ప్రకాశింపగనుట. నిజముగా శాకుంతలమున రెండు సంయోగములున్నవి నాటకమున కవియుద్దేశ్యము నాటకప్రథమాంకము లోని తొలి సంయోగము ఐహికము-క్షణికము-అందపు వలపు విలాసముతో కూడినదియు, కడపటియంకములోని యీ యుత్తమ సంయోగముగా, నిత్యాత్మానందము స్వర్ణాశ్రమపదములోనిదిగా మారుటం జెప్పుటయే. ఈ నాటకము ఏదేని యొక తీవ్ర మనోభావముం జెప్పుటకుగాని ఏదేని యొకపాత్ర శీలముం బోషించుటకుగాని ఉపక్రమింపబడినది గాదు. మరే మనగా, సర్వమును ఒక లోకమునుండి ఇంకొకలోకమునకు, అధోలోకమునుండి ఊర్ధ్వలోకమునకు మార్చుటకు, రాగమును క్షణికగ్రామ్య శరీరాంగరామణీయకము మీది నుండి స్వర్గ నిత్యాత్మ రామణీయకము మీదికి ఎక్కించుటకు ఎగిరించుటకు ప్రవృత్తమైనది......"అని.

రవీంద్రుడు మరియును చెప్పుచున్నాడు. "కాళిదాసు ఈ పరిణతిని, అదే స్వర్గ మర్త్యలోక సంయోగమును అవలీలగా సాధించినాడు. అతని మర్త్యలోకము స్వభావానుగుణముగానే ఎంతలో ఎక్కడ స్వర్గమునో ఆ హద్దును మనము, మెలకువతోనైనను, కనిపట్ట నేరము. తొలియంకమున శకుంతల పతనముయొక్క గ్రామ్య ప్రకృతి కవి దాగురింపలేదు. నాయకుని నడుమడియం దేమి నాయిక నడుమడియం దేమి అభిలాష ఆపతనమునకు ఎంతగా కారణమాయెనో స్పష్టముగానే చూపినాడు. యౌవనమునను కల్పించు ఒండొరుల పొగడికలు, క్రీడారతి, తుందుడుకు-ఇవెల్ల నిండార విన్యస్తమైనది. అట్లే గాటంపు సిగ్గువడును, ఆత్మభావప్రకటనకును పెను పెనగులాట. శకుంతల మౌగ్ధ్యమునకు, అదే చంచలతనమునకు, ఇది యొక తార్కాణ. దుష్యంతసమాగమునకు వలయు భావతీవ్రతకు శకుంతల సన్నద్ధగాదు. తన్ను ఆమె కొనుట కేని, తన భావమును కప్పుకొనుట కేని ఆమె ఎఱుగదు. ఇంకను ఆమె అజ్ఞాతమనవ(?). కావున ఆమె చిత్తమునకు తగిన వర్మ మేమియు లేదు. అంగు లేచుచున్న రాగమును కప్పుకపోవుటకు గాని లేపుచున్న కాముని శీలమును సంశయింపనుం గాని, ఆమెకు దిటము చాలదు. ఆశ్రమబాల, అచట భయమెఱుగని మృగశాబముల వలెనే, నట్టిచేలగా నుండెను. దుష్యంతుడు శకుంతలను వశీకరించుటను చాల స్వాభావికముగానే చెప్పినాడు. అంత సులువుగానే సమకూర్చినాడు, కవి, శకుంతల పతనపుచరిత్రతను, సహజమగు తదుపరి పాతివ్రత్యమును. ఇది శకుంతల యొక్క లేమికి, అతి మౌగ్ధ్యమునకు మఱియొక తార్కాణ. అడవి పూల రేకుల ధూళిని ఏ తోటమాలియు తుడువబనిలేదు. అవి అనావృతములే. వానిపై ధూళి దుమ్ము చేరును. చేరినను, అవి తమ రమణీయ నైర్మల్యమును గోలుపోవు. శకుంతలపై మఱికి పతనే పడినది; ఐనను అది ఆమెకు తెలియనే లేదు. అగియున్నను, బాహ్యారిణములవలెను, కొండయూటలవలెను ఆమె నిర్మలముగానే విరాజిల్లినది."

మఱియుం జెప్పుచున్నాడు, రవీంద్రనాథుడు- "ఆశ్రమమున పెరిగిన యీ బాలను సహజప్రసంధితోనే తన స్వభావమును అనుసరింపించినాడు. ఎక్కడను కుంచలేదు, అడ్డలేదు. ఐనను ఆమెను పతివ్రతల మేలుబంతిగా ఎదిగించినాడు. ఆమె గాంభీర్యమును, దుఃఖసహనమును, ఖరనియమపరతను ప్రోదిచేసినాడు. తొలుత ఆమె మనకు తన్నుదా మఱచుచు, తీవలవలెను పూవులవలెను, స్వభావము ఎటు ప్రేరించిన అటు సాగుచు నడచుచుండినది. కడపట ఆమెయొక్క ప్రాతిస్వికస్త్రీ స్వభావము ఆవిష్కృతమైనది—ఆ శాంతత, కష్టములకుంగు ఆయోగ్య ప్రతిముల ఆ నియమపరత, ఆ పరమ భక్త్యనుష్ఠానము. సాటిలేని శిల్పముగా కాళిదాసు తన నాయికను చేష్ట తూష్ణీంభావములయు, స్వభావ స్వేచ్ఛ కట్టుబాటులయు, ఏటు సముద్రములయు కూడలి హద్దుపై నిలిపినాడు. ఆమె నాయన మహాముని; ఆమె యమ్మయో అప్సరస; ఆమె జన్మ తపోభంగమునం కలిగినది. మఱి యామె పెరుగుట తపసాశ్రమమున, అనగా స్వేచ్ఛయు తపస్సును, అందమును ఆకయు అవిరుద్ధముగా కలయుచోట. అందు సంసారపు కృత్రిమంపు కట్టుపాటులు లేవు గాని, అంతకన్నను కఠినముగు ధర్మనియములు గలవు. ఆ గాంధర్వవివాహమును అతెఱంగుదే. ప్రకృతి(=సహజ) నిరంకుశతను పెండ్లిబంధముతో కూర్చుట. శాకుంతలనాటకము భావలో తనకుతానే అద్వితీయమై సాటిలేకయున్నది; ఏలన ఆకను స్వేచ్ఛతో పొంగు పఱుచుటను వెలయించుచున్నంగున. ఈ యాక స్వేచ్ఛల సంఘర్షణమున బుట్టినవే అందలి సంతోషములు, దుఃఖములు, కలయికలు విడిపోవుటలు అన్నియు... ...శకుంతల చంచలతనము స్వభావసిద్ధము;......అజ్ఞానమునం గలిగినది కాదు. తొలియంకమున శకుంతల చెలులిరువురును ఆమె యభినవ యౌవనమును ఆమెకు జ్ఞాపకము సేయుచుందురు. ఆమె సిగ్గుచెందుదములు నేర్పు

కొనును. ఐనను ఇవన్నియు బాహ్యవిషయములు. ఆమె శీలతనమన్ననో ఆంతరంగికమైనది. అట్టి ఆమె పరిశుద్ధియు. ఆదినుండి అంతమువఱకు కవి ఆమెను బాహ్యప్రపంచానుభవములేనిదానింగానే చూపును. ఆ శీలతనము చాల లోతైనదియు, స్వభావసిద్ధమును. ఆమెకు బాహ్యప్రపంచము ఇంచుక ఎఱుకయే; ఏలన ఆయాశ్రమము దానితో ఇంచుక పరిచయము కలిగినదే. అందు గృహకార్యములు పాటింపబడుచునేయున్నవి. శకుంతల బాహ్యప్రపంచమును బొత్తిగా ఎఱుంగనిది కాకున్నను దాని యనుభవము ఎంతయు చాలనిది. ఆమెకు మనసున ఎందును సహజవిశ్రంభము రూఢిగనియున్నది. ఆ సులభవిశ్రంభమున గలిగిన యా శీలతనమే ఒక నిమిషమున శకుంతలను అట్లు పసం ద్రోసినది. మఱి అదియే ఆమెను శాశ్వతముగా ప్రోచి నిలువం బెట్టినది. ఆ విశ్రంభమే ఆ యతిక్రూర విశ్వాసఘాత కలిగినపుడును ఓర్పును క్షమను ప్రీతితో టెవయను ఆమెయందు గలిగించినది................"

రవీంద్రుడు ఇట్లు శకుంతల శీలమును అతి నిశితముగా పరీక్షించినాడు. ఇట్టి యీ ముగ్ధ, నవయౌవన, శకుంతల చెలులంగూడి దుష్యంతునికి దక్కినట్టిది నవవసంతలక్ష్మింబోలినది గీతే చెప్పిన తీరమిగాని నవకము మాయని క్రొత్త పూలమంజరి కాబోలు. (the young years' blossoms.) ఐనను అట్లు ఆశ్రమధర్మమున నున్న యామె దుష్యంతునిపై అభిలాష గొనుట పతనమని ఠాగూరు విశ్వకవిచే పలుమాఱు నిర్దేశింపబడినది. దుష్యంతుడు ఆమెను అట్లు పశలాగి నాశగియు సూచింపబడినది. దాన నామె మీద అడవి పూలమీద గాలిగుమ్మగలె మునికి పడనేపడినది అనియు, ఐనను ఆమె పరిశుద్ధికి నిర్మలతకు సేగి కలుగలేదనియు చెప్పబడినది. 'ఆమె అజ్ఞాతమదన. ఆమె చిత్తమునకు తగిన వర్మమేమియు లేదు. అందు లేమచున్న రాగమును నమ్మకపోవుటకు గాని లేపుమన్న కాంతుని శీలమును సందేహింపనుంగాని ఆమెకు దిటము చాలదు.' అనియు ఉపన్యస్తము. ఇందు గవ్యంతుడు, పాపము శకుంతలను ఏమో చేసినాడు అని సాధుకోచునట్లు ఉన్నది. ఆ యాడంకముల శృంగారము మీద గ్రామ్యతముద్రయు మానవుమైలయు నెట్టనవైచునట్లున్నది. శృంగారమే "అసభ్యపరిపాటికో మధికరోతి" అనవలెకదా ఠాగూరు.

రామసీతలకో, అర్జునద్రౌపదులకో, ఉషానిరుద్ధులకో, ఉత్తరాభిమన్యులకో—అట్టి క్రొత్తవయసులో నున్న దుష్యంతునికి శకుంతలకునో అయోగశృంగారమును, తగిన పరిధానము కల్పించి చెప్పియున్న రమణీయతరమే యగునేమో. అప్పుడు నాయికలవలె నాయకులును, రామార్జునులును, అనిరుద్ధాభిమన్యులును క్రొత్తయువలు ఇదే తొలుమారుగా మన్మథుని కగ్గమాట—కాముని తొలి పతనము గనుట—అయోగశృంగారమునకు ఆలంబనముగుట అభిలషణీయతరమే యగునేమో. అట్టి యయోగశృంగారము మహాకవులు చెప్పినది మనకు అంతగా కొరకలేదు, నాగానందమున జీమూతవాహనుని శృంగారమొకటి ప్రసిద్ధముగా నున్నది మాలతీమాధవ మల్లికామారుతాదులును కొన్ని కలవు. (కావ్యమున కాదంబరిలో పుండరీక మహాశ్వేతలదియు కాదంబరీ చంద్రాపీడులదియు నళదమయంతులదియు అట్టిదే.) అయినను ఆ కవుల యా ప్రతిభ కాళిదాసు నీప్రతిభముందు ఏపాటిది? లెక్కకు రాలేదు. ఏలన బహుభార్యాత్వ, విశేషముగా క్షత్రియులకు, శ్రుతిస్మృతి శిష్టాచారముల ననుమతమై సాధుతతో వేరులు పాఱియున్న మన హిందూచిత్తమున దుష్యంతుని యీ యయోగశృంగారమున దోషముగాని అసంగతిగాని లోపము సాటిలేని శృంగారకవియగు కాళిదాసుని మువ్వురు శృంగారనాయకులును దుష్యంత పురూరవాగ్నిమిత్రులు బహుభార్యులే. మఱి శృంగారమునకు ఇంతకన్న దన్నుగొన్న నాటకములు లేవు. దుష్యంతుడు శకుంతలపై అభిలాష చెందుట, అంతట అయోగమున క్రాగుట, శకుంతలం బొందుట కాని, శకుంతల దుష్యంతునిపై అభిలాష చెందుట, అంతట అయోగమున క్రాగుట, దుష్యంతుం బొందుట కాని, 'పతన' మగునా? అది అతిపవిత్రనగ్రతమే యని హిందువుల సంప్రదాయము. దుష్యంతుడు అభిలాష చెందుచు తన చిత్తమును ఎంతయో పరిశీలించుకొనును 'అసంశయం క్షత్రపరిగ్రహక్షమా, యదార్యమస్యామభిలాషి మే మనః, సతాం హి సందేహపదేషు వస్తుషు, ప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః॥' అని తెంపొనికొనును. ఇది యూరక ఇంద్రియవశతచే తన మనస్సునకు మాటెగా చూచుకొని అసాధువును సాధువని యెంచుకొనుట గాదు. దుష్యంతుడు నిజముగా గొప్ప 'సత్పురుషుడు', ఆయనమనస్సు నిజముగా ఆర్యము, ఆ యభిలాష ఎంతయు తత్త్వస్పృశము అని దానిపై కుమారిలభట్టు, గొప్ప మీమాంసకాచార్యుడు తంత్రవార్త్తికమున ఇట్లు ప్రమాణముద్ర వైచినాడు.

'యథా గుణానాం లక్షణాకరేషు
హీరా యథావోజ్జ్వల రుక్మభూషా,
య జ్జాయతే తన్మయమేవ తస్మాత్

కానాం విపాక నిర్వ్యాపథు రక్షసహ్యాః' అని. శకుంతలకు దైవ మెంతయు ప్రతికూలముగా నుండె ననియు, దానిని శమిల్లజేయు కొఱకు కణ్వభగవంతుడే తాను సోమతీర్థమునకు పోయియున్నాడనియు, ఆ సంగతి ఆశ్రమమున పెద్దలకును అంతరంగికముగా తెలిసియుండె నని నాటకమున మొట్టమొదటనే 'ఇదానీ మేవ దుహితరం శకున్తలాం అతిథిసత్కారాయ నియుజ్య దైవమస్యాః ప్రతికూలం శమయితుం సోమతీర్థం గతః' అని వైఖానసులవారిమాట. ఆ యాత్ర తొడంగినది మొదలు దుర్దైవకమనము ఒకింత ఆగుచున్నను, తా సంకల్పించిన రాజాధిరాజు శకుంతలకై తానే ఆశ్రమమును వెదకి కొని వచ్చినాడో యన వచ్చి అట్టట్లు గాంధర్వమంగళముం గావించి గర్భమును ఆధానించినను, అది దుర్వాసః శాపాదికమును బొత్తిగా మాన్ప జాలదాయెను. తాను యాత్రకు తరలగానే, దుష్యంతుడు ఆశ్రమమునకు వచ్చినాడు! తాను యాత్రనుండి మరలగానే శకుంతలం గూర్చి మంచిమాట చెవింబడినది ఆమె వాడే దుష్యంతునియింటికి తగలింపబడినది. శాపమును, శాపకార్యము అట్లు అపాటి నిరాకరణ పునఃసంయోగముల బర్యవసించుటయు ఎంతయో శాంతిగన్న దుర్దైవపు మొక్కవోయిన వేగమని యెందదగును.

ఐనను రవీంద్రమహర్షి కావించిన యీ శకుంతల గుణశీలముల విచారము అటు యుండనీ; ఎట్లో ఒగ్గుకొందము. కుఱీ దుష్యంతు గూర్చిన యీయన విచారము కరము పాపిష్ఠమును అసహ్యమును అగును. దానిం జదివిన పాపమునకు మనము ఎట్లు ప్రాయశ్చిత్తము చేసికొందుమో! ఇదె చూడుడు.—

తొలుతనే శకుంతలప్రస్తావముననే 'శకుంతల ఇంకను అజ్ఞాతమదన. కావున ఆమె చిత్తమునకు తగిన వర్తమేమియు లేదు. అంగు లేచుచున్న రాగమును నమ్మకపోవుటకు గాని లేపుచున్న కాంతుని శీలమును సందేహింపను గాని ఆమెకు దిటముచాలదు.' అని దుష్యంతునియెడ దోషాంకురమును లేపినాడు. కుఱీ దుష్యంతుని శీలము ఉదాత్తము, వినయాలంకృతము, పవిత్రము, విశ్వసనీయము అని కాళిదాసు తొలుతనుండియు అల్లుకొనుచువచ్చుచున్నాడు. పినాకిం బోలినవాడట! పురువంశ ప్రదీపకుండట! బ్రాహ్మణవచనమున గౌరవ విశ్వాసములుగలవాడు. ఆశ్రమ మృగమును కొట్టడు. పుణ్యాశ్రమదర్శన కుతూహలి. కణ్వభక్తుడు. తపోవనమునకు ఉపరోధమును పరిహరించును. తన మనము ఆర్యమని ఆత్మ విమర్శచేసికొనును. మెఱపు దీగవలెవు ఆ యప్సరో రాజర్షుల యాత్మజపై అభిలాష వహించును. ఇట్టి యకలంకునియెడ కలంకము తోపజేయుదగునా? ఈ నాయికానాయకుల యుభయు ప్రార్థన పవిత్రముగానే నిర్వహింపబడినది; గ్రామ్యత ఇంచుకయు లేదు. శకుంతల దుష్యంతుని నమ్మట; కాదు దుష్యంతుడు శకుంతలను తిన్నగ నమ్మజేయుట- ఇందు దుష్యంతునియెడ మోసపు బోగయైనను కలదా? వేలను శకుంతలను క్రిందబఱలాగినా జనదగునా? 'ఋషిభ్యో నాతిభిన్నో రాజని' అనియు 'వశినః' అనియు ప్రతిష్ఠితకీర్తి యగు దుష్యంతుని 'సద్వైరము' లేచుచున్నటియు శకుంతలా దుర్దైవము అడంగుచున్నటియు ప్రకారముగదా ఇది కవిహృదయమువ? దుష్యంతుడు ఇంద్రునికిని రణసహాయుడు అని కణ్వాశ్రమమునను ప్రసిద్ధికలదు. తాపసకుమారులును ఎఱుంగుదురు. అంత దూరానను పరోక్షమునను విషయాపదకును అపాయమునకును, ఆశ్రమజనమునకు ఆశ్రమమృగమునకు, దుష్యంతుడే రక్షకుడని ఆశ్రమ స్త్రీజనము నోటను-'దుష్యన్తః మాక్రన్దస్వ' అన్నట్లు - మెదలుచుండు పేరివాడు. ఋషుల చిత్తమున "రాజర్షి గా" ప్రసిద్ధుడు. శకుంతలకు అందనివంతగువని తోపకును గాని నమ్మకముచాలనివానిని తోపకూడదు. అతడు సంతానహీనుడు, పుత్రార్థి; ఆ బ్రాహ్మణవచనమును గ్రహించినాడు. మంచి శుభశకునము చూచుకొన్నాడు ఇంట అతని తల్లి పుత్రపిండపాలన వ్రతము చేయుచున్నది. కావున "పరిగ్రహబహుత్వేపి ద్వే ప్రతిష్ఠే కులస్య మే, సముద్రరశనా చోర్వీ సఖీ చ యువయోరియమ్" అను మాటను దుష్యంతుడు త్రికరణశుద్ధిగా చెప్పినదేకాని, అందును వందనవాసన యేని లేదు. ఉంగరము క్రేలనుండి గనువుపెట్టి పిలిపించుకొందు నన్నపుడును అతని చిత్తమున లేశమును మోసములేదు. మతి తాను హస్తినలో ఇంట అడుగు పెట్టబోవు నిముసముననే, అది తలంచుకొనియే శూన్యహృదయముగా నున్న శకుంతలపై బడిన శాపము దుష్యంతునిస్మృతిం గొట్టినది. అది అతని దోసముంగాదు. అంతట అతనికి సర్వమును మఱపే, తన శకుంతల సమాగమము బోనకు అందని జన్మాంతర వృత్తమువంటిది, అయిపోయినది. దుష్యంతుం గూర్చి కణ్వుడు కూడను తరలించుచో 'భర్తారం ఆత్మసదృశం' అనియు, ఆత్మగతమున 'తత్రభవతో దుష్యన్తస్య యుక్తరూపమ్' అనియు, 'అభిజనవతో భర్తుః' అనియు, 'భర్త్రా తదర్పిత కుటుంబభరేణ సార్థం' అనియు అతి బహుమాన

పురస్సర నిర్దేశములం జేసెను. ఆయుశ్శిష్యుడు, నగరు చొచ్చిన శార్ఙ్గరవుడు తన మనమున చిర రూఢమును అపుడును అపాతముగా తోరాక్రాణపడినదియు నగు దుష్యంతుని రాచఠీకమును ఇట్లు మెచ్చుకొన్నాడు.

"మహాభాగః కామం నరపతి రభిన్నస్థితి రసౌ
న కశ్చి ద్వర్ణానా మపథ మపకృష్టోఽపి భజతే."

అని. అట్టి దుష్యంతునిం గూర్చి రవీంద్రర్షి చెప్పినాడు. "బహుభార్యుడగు దుష్యంతుడు శకుంతలను పోద్రోచుట అతని స్వభావముం బట్టి లోకకే నిజముగా ఎట్లును జరుగునదే. (కాముచపలుడు, నూతనప్రియుడు)... ......రాజు పాపాత్మత మనకు తెలియుటకు కవి అతని పైకప్పున ఒక చిన్న చినుగుకుండా కల రూపం చూపినాడు. అదే ఐదవయుంకము. శకుంతల వచ్చి, భర్తచే ప్రత్యాఖ్యాత యగుటకు రవంతముందు రాజశృంగారవిషయముల (గుట్టు)మీది తెరను క్షణము తొలచి తత్త్వముం జూపినాడు. హంసపదిక రాణి తనకు తానే సంగీతశాలలో పాడుకొనుచున్నది. 'అభినవ మధులోలుప స్త్వం తథా పరిచుంబ్య చూతమఞ్జరీం, కమలవసతిమాత్ర నిర్వృతో మధుకర విస్మృతో స్యేనాం కథాం.' అని. రాణివాసమున నొగిలిన చిత్తమునం బొమిన యీ యశ్రుసిక్తంపు బాట మనకు తటాలున అనుకొనని యదరుపాటుం గూర్చును; విశేషముగా మనచిత్తము ఇంతకుముందే (ఆశ్రమమున) శకుంతలతో రాజు పలికిన యనురాగంపు బాసను వినియున్నందున.........ఆమెకు మహానురాగ భవనమగునని మనము ఆసగా ఎదురుచూచుచున్న దానిపై ఇపుడొక మాయని మచ్చ పడుచున్నది... ......... రాజవలపు క్షణికము యగునను ఈ సూచన ఈయంకారంభమున వృథాగా చేయబడినది కాదు. కడునిపుణతతో ఇట కవి దుర్వాసుని శాపకార్యమునకుం గారణము మానవప్రకృతిలోనే యున్నదని స్పష్టపఱుచుచున్నాడు." (మఱి శకుంతల యెఱుంగనట్టియు, తోడువచ్చిన తదీయు లెఱరును ఎఱుంగనట్టియు, దుష్యంతుడును ఎఱుంగనట్టియు ఆ శాపమునకు వేగారంభ మెట్లగునా అని ప్రేక్షకులు ఎదురుచూచుచున్నారు గదా) 'The desertion of Sakuntala by the amorous Dusyanta which in real life would have happend as the natural consequence of his character, is here brought about by the curse of Durvasa.................. But the poet has left a small rent in the veil thro' which we can get an idea of royol sin. It is in the fifth act. Just -before Sakuntala arrives at court and is repudiated by her husband the poet momentrily draws aside the curtain from the kings love affairs. A woman's voice is heard singing behind the scene.

"O honey bee, having sucked the mango blossoms in your search for new honey you have forgotten the recent loving welcome by the lotus". (This is wrong-rendering of the original or must be you 'have forgotten them, feeling all content and happy in your lotus abode.')

This tear stained Song of a stricken heart in the royal household gives us a rudo shock especially as our heart was hitherte filled with Dusyanta's love-passages with Sakutala .. .. ....And now a stain falls on the picture we had so hopefully formed of the home of love to which she was going. ........... This indication of the fickleness af royal love is not purposeless at the begining of the fifth Act. With masterly skill the poet here shows that what Durvasa's curse had brought about had its seeds in human nature." Tagore.

అయ్యయ్యో, ఇక్కడి నాటకసంవిధానము మహర్షికి రవీంద్రనాథునికి అంతయు బోధపడలేదు. విశ్వకవికి ఈ శాకుంతల సంప్రదాయము తెలియలేదు. శకుంతల పరమపతివ్రతయయి హిందూ స్త్రీలకు ఎంతటి లక్ష్యభూతురాలని రవీంద్రునిచే నిజశిలోపన్యాస ప్రశంసలం గన్నదో, అట్లే దుష్యంతుడును హిందూ పురుషులకు, గొప్ప హిందూ రాజులకు లక్ష్యభూతుడుగా కవిచే ఉద్దిష్టుడు. మను మాంధాతలయు దిలీపరఘు శ్రీరాములయు వరుసకు చెందినవాడు, కాళిదాసు చిత్తవీథిలోను హిందువుల శిష్టగోష్ఠిలోను తొలిమెట్టున నుండువాడు, తనకు ఎంచను మించినవాడు లేనివాడు. అతనిని కాళిదాసు ఈ నాటకమున అట్టివానిం గానే నిర్వహించినాడు. అట్టివానిం గూర్చి "బహుభార్యుడగు దుష్యంతుడు శకుంతలను పోద్రోచుట అతని స్వభావముం బట్టి లోకకే నిజముగా ఎట్లును జరుగునదే......

రాజు హంసపదికను మనకు తెలియుటకు కవి ఒక చిన్న ద్వారము తెఱచి చూపినాడు. అది హంసపదిక పాట." అనుట ఎంత అనరానిమాట! శాంతము పాపము! శాంతము పాపము! మనశ్శాస్త్రప్రవీణుడు కవికుల గురువు మహోత్కృష్టుడు కాళిదాసు 'అభినవ మధు లోలుపో' అను పాటను ఏ మహాప్రయోజనమునకై పాడించి నాడో హంసపదికచేత అది మహార్థి ఇంచుకయు గ్రహింపఁడాయె. హంసపదిక ఒక భోగముపిల్ల. ఆ పేరె చెప్పుచున్నది. "దేవ్యాస్తు ధారిణీ లక్ష్మీ వసుమత్యాది నామభిః, భోగవతీ కాన్తిమతీ కమలా కామవల్లికాః ఇత్యాదికా హంసపదీత్యాది నామ్నాతు భోగినీ" అని సింగభూపాలుడు రాణులకును భోగినులకును తగిన పేరులను వేఱువేఱుగా చెప్పినాడు "హంసపదికాయా రాజ్ఞ్యాః శ్రియాత్ త్రిభువనీ త్యుపచారో వినూపకః హంసపదికా నామ భోగినీ రాజ్ఞః" అని కేశవభట్టు శ్రీనివాసాచార్యులవారు. 'హంసపదికా Was a Concubine వేశ్య of the king'- అని వేదము వేంకటరామశాస్త్రులవారు. విదూషకుడు 'అది తన వారితో నన్ను కొట్టు పట్టుకొని కొట్టుమని చెప్పిన నేను ఎట్లు తప్పించుకొందును' అనుటయు, అందులకు రాజు 'నాగరకముగా తప్పించుకొమ్ము' అనుటయు అది భోగముపిల్ల యింటి వృత్తి యని రూఢిసేయుచున్నది. ఆ హంసపదికతో 'సకృత్ కృతప్రణయోఽయం' - ఒక తూరి ప్రణయముం గలిపినాడట, దుష్యంతుడు. తరువాత దేవి వసుమతి (దేవి) యింటనే యున్నాడు. మరల తనకడకు రాలేదు. అన్ని సూచనగా తన మధ్యాహ్న నిత్య గీతాభ్యాసముగా మధుకరాపదేశమున ఈ వర్ణముం బాడినది. రాజు నవ్వుచు "ఆ యుపాలంభ మును గ్రహించితిని" అని చెప్పి పంపుట "మరల ప్రణయ మును సాగింతును లే— నేఁడో రేపో వత్తును లే" అని యూరట తెలుపుటయె. అట్లు నవ్వగా అంతట హంస పదిక ప్రస్తావము ముగిసిపోయినది. అటుపై వేఱు ప్రస్తావము. ఏమనగా, అంతట రాజు అనును—'కిం ను ఖలు గీతమేవం విధార్థ మాకర్ణ్య, ఇష్టజనవిరహో దృతేఽపి బలవ దుత్కంఠితోఽస్మి. అథవా—

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్ సుఖితోఽపి జన్తుః,
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తర సౌహృదాని.' అని.

'ఇతి పర్యాకుల స్మృతి' అన్నాడు కాళిదాసు. ఈ యుత్సుకతను, పర్యాకులతను దాని తెలివిడితో గూడ, కాళిదాసు కాక మఱెవ్వరు చెప్పగలరు, దుష్యంతుడు కాక మఱెవ్వరు దానిని పడుచు ఇట్లు వాగారంభముం బొరయింపగలరు! శకుంతలసంయోగము, రాజుస్మృతి శాపహతమైనందున, అబుద్ధి భావస్థిర జననాంతర సౌహృదముంబోలె నిలిచియున్నది. దుష్యంతుని పర్యాకులత తనకు ఎఱుంగరాని నిజవిర హితవలననే అనియు, శాపమున్నను రతికి శకుంతలా విషయక నిశ్చయము తొలగమిచే ఇగి యిట్లని యెఱుంగ రని మెఱమెఱయు అకుంఠపాటును అయినదన్న మాన సిక సహాయ్యమును కాళిదాసు ఇట్లు అనన్యాదృశముగా చెప్పినాడని సంప్రదాయవిదులు అందురు. ఈయంశము కథ శకుంతలకన్నను దుష్యంతునికి పరీక్ష; ఆమె బాధకన్నను దుష్యంతునిబాధనె ఎక్కువగా చెప్ప వలదగును. కాదా వారిది మనకు ద్రష్టలకు ఒక్క తెఱంగే. అయ్యో ఆమె ఇక నేమిసేయఁగలదు అన్నట్లు అయ్యో ఇతఁ డింక నేమిసేయఁగలఁడు అని పించును. 'Sakuntala feels as if she had been struck with a thunderbolt'అన్నారు రవీంద్రనాథు. అట్లే 'Dusyanta feels as if he had been struck with a thunderbolt' అనదగును. 'అహో ధర్మాపేక్షితా భర్తుః! ఈదృశంనామ సుఖోపనతం రూపం దృష్ట్వా కోఽన్యో విచారయతి!' అని కన్న వారు విన్నవారు దుష్యంతుని ధర్మాపేక్షను మెచ్చు కొన్నారు. అది కాళిదాసు హృదయము. 'వ్యపదేశ మావిలయితుం కిమీహసే జన మిమం చ పాతయితుం?' అని దుష్యంతుడు బిట్టు ఏడ్చినాడు! ఇందు పుటము తీసిన పదియార్వన్నె బంగారమైనాడు. తరువాత సానుమతి దుష్యంతుం జూచుచుండినపుడు శకుంతలకై న అతని యాఱని మనశ్శయగుఃఖమునకును వసుమతీ దేవిని తప్పించుకొనుటకు అతడు పడినపాటు పలికిన పలుకు ఎంచిచూచి 'అన్యసంక్రాన్తహృదయోఽపి ప్రథమసంభావనా మవేక్షతే. అతోఽశిథిల సౌహృద ఏష ఇదానీం' అని దుష్యంతుని దాక్షిణ్యమునకు తను వారిం గూర్చిన మగవారికుట్టులు కనిపట్టగల తన యప్సరః ప్రాగల్భ్యముతో రాజావు పలికినది. అను శయముచే ఈతని హృదయము గాఢముగా శకుంతల యెడ సంక్రాంతమని సానుమతికి ఇంతవట్టు ప్రత్య క్షమేగదా. వినను ఇతడు అంతఃపుర ప్రతిష్ఠితమైన

# శాకుంతలము: రవీంద్ర కవీంద్రుడు

దాక్షిణ్యమును రక్షించువాడు అను నాతని సౌజన్యమును సయితము ఇప్పుడు ఎఱుంగుచున్నది. ప్రథమ సంభావనను ఇట్లు అపేక్షించు నితడు మఱినాడు, అన్యాసంగముచేత నైనను, శకుంతలను ఏల నిరాకరించె నమ్మా! నిజముగా శాపముచేతనే కావలయును. మఱి యా శాప మేల కలిగెనో గదా, పాపము! అని నా మది తలపోతలు.

రవీంద్రనాథ మహర్షి గొప్ప కవి సహృదయ చక్రవర్తియే. ఆంగ్లంగూడ అతిప్రౌఢసహజమనోహరముగా పుట్టాంగ్లులంబోలె వ్రాయ నేర్చినవాడు నయే. విశ్వవిఖ్యాతుడే. ఆయన యాంగ్లగ్రంథములను పాఠ్యములుగా గొప్పయూనివర్సిటీ పరీక్షలకును ఇచ్చుదురు. హిందూరచితమగు ఆంగ్లమును అట్లిచ్చుట అరుదు. మఱి తద్గీర్వాణపరిచితి పాండితులు ఎట్టివో నాకు తెలియదు. ఆయన ఈ శకుంతల దుష్యంతుల యుగావుగిరియొషను పొరపాటునం బడినాడనియే చెప్పవలసియున్నది. శకుంతలం గూర్చిన మాటలు అంత కాకున్నను దుష్యంతుం గూర్చినవి పాపీయములే యగును. అది యొకవేళ సాక్షాద్గీర్వాణీపరిచయము చాలనందున అనిర్భరించియుండు నేమో. ఆయన వ్యాఖ్యానించిన పొగడికకు ప్రభవమయిన గీటేయును గొప్ప కవిసహృదయచక్రవర్తియే. ఆయనయేని యీ గీర్వాణశాకుంతల ప్రత్యక్షర సాక్షాదాంతరంగిక పరిచయము కలవాడైనో కాడో నాకు తెలియదు. కాదనియే తోచును. ఆయన మెచ్చుకోలు రవీంద్రనాథునకు కాదన్న వటే యానందోద్గారమే యగును. తొలి మూడంకములు కథయు శకుంతలను సఖులను ఆశ్రయించినది బాల్యపు గుసుమములు అనదగునేమో. నాలవయంకమున నాయన శకుంతలను అంతర్వత్నిని పతియింటికి తరలించుట పూతతీతి కాపు పట్టుటయా? మారీచాశ్రమమున భరతుతోడి శకుంతలను దుష్యంతుడు కూడుట ఫలమై, నడిమి రైదవయాఱవయంకములకథ పూవు ఫలపరిణతి జెందు క్రమావస్థయా? ఇట్లు అవయవములు విఱిచి విఱిచి పరీక్షింప దగదేమో. ఎట్లైనను రాగము తుణిక గ్రామ్య శరీరాంగ రామణీయకమునుండి స్వర్గనిత్యాత్మ రామణీయకమునకు ఎత్తబడినది, ఎగిరింపబడినది అనుట అదేమో! అది ఆదినుండి అంతమువఱకు ఏకవిధపవిత్రతతోనే వెలసినది. శకుంతల చరితమునగాని దుష్యంతుని చరితమునగాని ఈ యేడంకములలోను ఎందును ఏమాలిన్యము గాని లేదు. ఇకను భూస్వర్గముల కొక్కట యోగము అదెట్టిది? ఆ సంయోగము శాకుంతలమను ఏకనామమున అని గీటే. భూమి క్రమముగా స్వర్గముగా పరిణమించును, అది యెక్కడ ఎంతలో ఆ పరిణతిం జెందునో మనము మెలకువ కలిగియుండ నిపట్టు నేరమని ఆ గీటేసూక్తికి రవీంద్రర్షి వ్యాఖ్య. దానికి గాని దీనికి గాని అర్థమేమో, నిర్వాహమెట్లో. (a) తొలి మూడంకములలోను కథ ధర్మ్యగణ్య కణ్వాశ్రమము లోనిది. హిమాలయము పడివారము, మాలినీతీరము, హంసమిథునములు, జింకకదుపులు, పూలతోటలు, లతానిలయములు-వినితోడి ప్రశాంతమగు నాశ్రమము. సర్వరమణీయము. ఇది భూమియా స్వర్గమా? మేనక కూతురు మెఱుపుదీవ శకుంతల; పురుహూతసఖుడు, అచ్చరల కనువిందు మాటిమాటికి స్వర్గమున స్వాగతము బొందువాడు దుష్యంతుడు. వారి తొలిశృంగార విలాసము భూమి. అది భూమియే యగునా, స్వర్గమగునా, భూస్వర్గసంయోగమగునా? (b) నాలవ యంకమున నాగనకును కూతుఁకును వనమ తీవములు తీర్చిపాదములం గూర్చుచు మింట అగ్ని గుహశరీర వాక్కు, వనదేవతల దివ్యకోకిలకుహూవులు, నారోపంగినవి. స్వర్గమునను దొరకనివో యని దుష్యంతుని విభవమునకు సన్నిహితములో, దివ్యభూషణ స్వర్ణాభరణములు, వారికి అశరీరవాక్కు వ మింట నిక పూర్వక రమ్యాంతర కమలినీ హరితాది మార్గనాన శుభాశంతినము- ఇదియు భూస్వర్గ సంయోగమగునా? (c) ఐదవయంకమున భర్తృనిరాకృతయై ఆ పవిత్రాగ్ని కరణమునుండి వెలువడి వీథిలోనికి రాగానే దివ్యతోపకము కకంఠముగా ఏమువజొచ్చిన శకుంతలను స్త్రీజ్యోతి మేనక అప్సరస్తీర్థము చాయ కొనిపోవుట అది భూస్వర్గయోగమా? (d) ఆఱవయంకమున దుష్యంతుని విప్రసంధ విరహోన్మాదము పరికించినను అచ్చర సానుమతి దిగివచ్చి చూచుచుండి సర్వమును ఎఱింగి, పునస్సంయోగమునకు దేవతలు పనిచేయుచున్నారని చెప్ప వింటి కొగనిపోవుటయు, మాతలి ఇంద్రరథముతో దిగివచ్చి దుర్జయసంహారమునకు దుష్యంతుని స్వర్గమునకుం దోడ్కొనిపోవుటయు- ఇవియు ఒక తెఱంగు భూస్వర్గసంయోగ మగునా? (e) ఏడవ యంకమున స్వర్గమునుండి హరిచందనచర్చా మందార మాలలతో దుష్యంతుడు తన విజయప్రశస్తిని దేవతలు

పొదుచుంపగా వినుచు వాయుస్కంధములను దరుసగా దిగుట, వదును హేమకూటమున, అటు స్వర్గమునం గాక ఇటు భూమినిం గాక, అంతరాళమున నుండి, స్వర్గమునకన్న నిర్వృతి యిడు అమృతహ్రదమువంటి చోట, ఎటు చూచినను కల్పతరువుక్రిందనే పసిడి తామరకొలకుల చెంతనే చింతామణిశిలల మీదనే, అప్సరః పరిచరితులగుచునే యుండి, తెఱచిన కన్ను మూయకయు మూసినకన్ను తెఱువకయు ఏకధారా ధ్యానముగా తపముచేయు ఋషులుండుచోట మారీచాశ్రమమున ప్రవేశించి సర్వదమనునితోడి శకుంతల పునఃసంయోగముపొంది, అదితి మారీచుల దర్శనము చేసికొని తరలి సకల సామ్రాజ్యభోగములకు హస్తిన బంగాళా చేరుట—ఇది యుక్తమైన భూస్వర్గ సంయోగముగదా? ఇవే యగునా ఆ యొక్కటనైన భూస్వర్గసంయోగములు, గీతే తన మనసునకు తెచ్చుకొన్నవి? నాడు అట్లు వీథిలో ఏడ్చుచున్న శకుంతలను తల్లి మేనక కొనిపోయి హేమకూటమున మారీచాశ్రమమునం జేర్చెను. దాని ప్రయోజన రహస్యమును కాళిదాసు దుష్యంతునిచే చెప్పించినాడు. అతడును అను శయదుఃఖాగ్నిలో పుత్తు తెలియునట్లు మాడి యను భావసూత్రముతో నుండువాడు స్వర్గమునుండి వచ్చు దారిలో మాతలిచే అచటికి చేర్పబడెను కదా. అచట అడుగు మోపగానే ఆత్మను జల్లుమనగా 'స్వర్గాదధికతరం నిర్వృతిస్థానం! అమృతహ్రదమివ అవగాఢోస్మి' అని యన్నాడు. ఎట్టి భిన్నచిత్తమును అచట తనంతట ప్రసాదము గనును. కావున నాడు శకుంతలయు, తల్లి తన్నచట దింపగానే, తనంతట అట్టి చిత్త నిర్వృతి గన్నది. రవీంద్రుడు చెప్పిన యీ పుట్టుపతివ్రత శకుంతల తన యెఱింగిన యేకారణమును లేకయే తాను భర్తృనిరాకృతయైనందున, మఱి తనకు ప్రత్యాశావకాశము లేమి, ఫలము కోరకయే అతాపససిద్ధిక్షేత్రమున, దేవతాగురువుల సాక్షాత్సన్నిధిలోను ఎఱుక లోను, ఇక్కడ అంకమును ఇట్లే యున్నట్లు, సాధారణముగానే విరహవ్రతము తొడంగినది. మారీచుల వారికి శకుంతలను చూడగానే శాపమును, దాని నివృత్తి కాలక్రమములును చిత్తమున పొలసినవి. అదియే ఆమెకు ఆయన కరుణాకటాక్షము. కాలమున భర్తృపునఃసంయోగఫలము సమకూడినది. మఱి మాలినీతీరపు శామ దైహిక కామసంయోగము అనుశయదుఃఖమునను విరహదుఃఖమునను మాడి స్వర్గస్థమై ఆత్మప్రేమసంయోగమైనది. శాకుంతలమున ఒక్కట భూస్వర్గసంయోగమన అని యని రవీంద్రదర్శి వ్యాఖ్య. మఱి తొలియంకమున 'కృష్ణసారే దదచ్చక్షుః' అను సూతు తొలి భాషితము మొదలుకొని కడపటి మారీచుల యాశీర్వాదము 'త్వయి భవతు బిడౌజాః ప్రాజ్యవృష్టిః ప్రజాసు' అను ముగింపువఱకు 'భావో భావం నుదతి విషయాద్రాగబన్ధః స ఏవ' అన్నట్లు ఏకరాగబంధముగా వెల్లి విరిసిన శాకుంతల శృంగారరసంపుముడువున పెద్దలు అనుశాసించిన యీ 'సద్యఃపరనిర్వృతి' పొంగారుచుండగా 'ఆత్మదేవ సంతసము గొనునో, సుఖపరవశమగునో, పండువు గనునో విందారగించునో అది యెల్ల బ్రహ్మానంద సబ్రహ్మచారిగా సమృద్ధమైనది. గీతే Wouldst thou the young years' blossoms' ఇత్యాది ఆత్మానందోద్గారమునకు ఇదెల్ల ఇంచుక ఒక తెలుంగు సమర్థనమగునా?

"పాపేభ్యశ్చ పునాతు వర్ధయతు చ
శ్రేయాంసి సేయం కథా
మఙ్గల్యా చ మనోహరా చ జగతాం
మాతేవ గఙ్గేవ చ."

"సరస్వతీ శ్రుతిమహతాం మహీయతామ్."

# గృహోన్ముఖుడు

శ్రీ తాడిగిరి పోతరాజు

మునిసిపాలిటీ కార్యాలయంనుంచి బ్రహ్మరాక్షసిలా కేకపెట్టింది 'సైరను'. రాత్రి ఎనిమిది గంటలయిందని గ్రహించి, అందరూ త్వర త్వరగా తమ తమ కార్యకలాపాలు ముగించుకొనటానికి ప్రయత్నం చేస్తున్నారు. అప్పటివరకూ కార్యసాధనలో నిమగ్నులై ప్రపంచాన్ని మరచిపోయినవ్యాపారస్తులు, రాజకీయవేత్తలు, సైరను చెవుల్లో 'గింగురు' మనేసరికి త్రుళ్లిపడి, ముంజేతి వాచీచూసుకొని, ఒకరిదగ్గర ఒకరు సెలవుతీసుకొనటాని కుపక్రమించారు. దుకాణాదారులు, డబ్బు లెక్కపెట్టుకొని, కొట్లు మూస్తున్నారు.

పగటివేళ ఆ బజార్లలోనున్న అవసరాన్ని రేపటికి వాయిదావేసి అందరూ సర్దుకుంటూన్న వేళలో, ఆ ప్రదేశానికి వింత వ్యక్తులు, కొత్త వ్యక్తులు పోగవుతున్నారు. రాత్రించరులను ఆహ్వానించటానికై వికృతంగా తీగెలు చుట్టుకొని నిల్చున్నాయి విద్యుద్దీపస్తంభాలు. ఉదయం ఆఫీసులకు బయలుదేరే ప్రభుత్వోద్యోగుల్లా జారులు, చోరులు మెయిన్‌రోడ్డు ప్రవేశిస్తున్నారు. వీరి కార్యసాధనకు అనుకూలసమయ మీ నిశీథిని. వీరితోపాటుగా, వీళ్ళ సవతిపిల్లలైన పోలీసులు ధర్మరక్షణార్థమై, ప్రజాక్షేమం కొరకు, విజిల్స్ వేసుకొంటూ, సంజ్ఞలు చేసుకొంటూ జాగరణకు సిద్ధపడుతున్నారు.

ప్రతిరోజూ, ఈ వేళకు, ఈ రెండువర్గాలకు చెందిన మానవులు ఆఊరిలో ఆ సినిమాహాలు ముందున్న సత్రంవద్ద సమావేశమౌతూంటారు.

ఆ సత్రం రెండంతస్థులమేడ. క్రిందిభాగంలో అరఫర్లాంగుపొడుగునవున్న ఆ పంచపాళిలో నానా జాతిసమితి సమావేశం జరుగుతూంటుంది. ఆ పంచకు ముందు భాగాన, శిథిలమై చిల్లులు పడిపోయి జీరాడుతున్న మురికిగోనెపట్టాలు వ్రేలాడుతున్నాయి. వాటచెంతనే, అతుకులువేసిన కౌపీనగుడ్డలు, చీరెలు ఆరకట్టబడివున్నాయి.

సత్రంలో జనమాత్రం పల్చగనే వున్నారు. అక్కడక్కడ ఓ సన్యాసి, మురికిగుడ్డలమూటలు, వాటి చెంతనే నగ్నశరీరులై నిద్రిస్తూన్న అనాథపిల్లలూ, తప్ప మరెవ్వరూ లేరు. ఆ సత్రాన్ని చిరకాలంగా కనిపెట్టుకొని బ్రతుకులు సాగిస్తున్న మహానుభావు లందరూ, ఇంతకుపూర్వమే "మాదాకవళం తల్లీ!" ఉద్యమంలో పాల్గొనటానికి వెళ్ళారు. ఇప్పుడా ఉద్యమ నాయకు లందరూ, జట్లు జట్లుగా చేరుకుంటున్నారు. అంధులు, అంగవికలులు, కుష్టురోగులు, వర్గభేదం పాటించి, ఎవరి నిర్ణీతస్థలాల్లో వారు ఒదిగి కూర్చుంటున్నారు.

వీరు కాక భిక్షాటనచేసినవారు క్రిందనున్న మురుగుకాలువ చెంతనే వంటప్రయత్నం సాగిస్తున్నారు. పొయ్యిక్రింద మంటకొరకు కారుటైరుముక్కలు, చెత్తచెదారం ప్రోగుచేసి, కాల్చుతున్నారు. వాళ్ళకు సమీపంగా 'డస్ట్‌బిన్'లో చేరి రెండుపందులు మామిడివిత్తనాలు కొరుకుతున్నాయి. మందంగా నిశ్చలంగా ప్రవహిస్తూన్న ఆ మురుగుకాలువ, అదొకరకమైనదుర్గంధాన్ని వెదజల్లుతోంది. కాలుతున్న ఆ టైరుముక్కలు అదోకరకం కంపుకొడుతున్నాయి. ఏ వాసన ఘాటుగావుందో నిర్ణయించలేక బాటసారులు ముక్కుకు 'రుమాలా' అడ్డంపెట్టుకొని నడకసాగిస్తున్నారు. అయితే ఆ వాసన అక్కడ అరుగుపై ఆసీనులైన వ్యక్తులపై ఎలాటి ప్రభావం చూపలేదు. ఒక్కరు తప్ప అందరూ, అనేక అనుభూతులతో, స్మృతులతో, నిర్లక్ష్యంగా కూర్చున్నారు, మహాయోగులుగా పర్ణశాలలో కూర్చున్నట్లు. ఆ వ్యక్తి ఎదురుగానున్న దిమ్మెకు కాళ్ళుతన్నిపెట్టి, తలక్రింద ఒక పాతగుడ్డల మూట పెట్టుకొని కళ్ళుమూసుకున్నాడు. రబ్బరు కాలుతున్న వాసన భరించలేక "ఛీ...పాడు గవులు...గబ్బుకొడుతోంది...ఎవడ్రా అక్కడ" అని గర్జించాడు. ఆ దెబ్బతో, అక్కడచేరిన దైవస్వరూపులందరూ అటు కేసి చూశారు. మెఱుపులా వచ్చి ఆ పొయ్యి వెలుగు అతనిముఖంపై పడింది. కోసేరులా ఇంత పొడుగు ముక్కు, రెల్లుదుబ్బుల్లావున్న కనుబొమలు కుంచించుకుపోయాయి. గుంటలుపడిపోయి, జ్యోతుల్లా మెరుస్తున్నాయి కళ్ళు. వెలుగు ముఖంపై బడగానే కను

రెప్పలు ముకుళించాయి. బాధగా కళ్లుమూసుకొన్నాడు. దవడ ఎముకలు ఎత్తుగా ఉబ్బి బయటికి పొడుచుకొస్తున్నాయి. "మంట ఆర్పుతున్నానులే!" భయకంపిత స్వరంతో, దీనంగా సమాధానమిచ్చింది ఒక కంఠం పొయ్యిదగ్గరనుంచి. దానితో తృప్తిపడి ఆవ్యక్తి మళ్ళీ వెనుకకు చేరగిలపడ్డాడు. అయినా విసుగు, కోపం తగ్గలేదు. "ఎదవసత్రం...ఎదవసత్రం" అని గొణుక్కున్నాడు.

అంతలో అక్కడకు మరొక బికారి చేరాడు. పడుకున్న ఆ వ్యక్తికేసి కోపంగా చూశాడు. కాని పడుకున్న వ్యక్తికి ఆ చూపు కన్పించలేదు. ఇక లాభం లేదనుకొని "ఏయ్! ఎవరు నువ్వు? నాసోట్లోనుంచి లే" అన్నాడు.

పడుకున్న వ్యక్తి కదలలేదు, పలుకలేదు.

"నీకేనోయి చెప్పేది. లేస్తావా! లేవ్వా?" అని రెట్టించాడు, ఆస్థలం వాడి 'జన్మహక్కు' యినట్లు. మళ్ళీ రెండుసార్లు పిలిచాడు.

ఈసారి పడుకున్న వ్యక్తికి ఒళ్లు మండిపోయింది. చివ్వనలేచాడు సిగ్నలుకెసులా.. "లేవనోయ్...ఏం చేస్తావేం?" అని హుందాగా రొమ్మువిరుచుకొని పలికాడు.

ఆ రఘుగులమనిషి కసాయివాడి భంగిమలో లేచి నిల్చొనేసరికి గుండె జల్దరించింది. కాని ఇప్పుడు నోరు, యూసుక్కూచుంటే, అందరిదృష్టిలో తేపు పుచ్చయి పోతడు. ఈ ఆలోచన తట్టగానే కోపం పొంగిపోయి "బూతుపేసు"లా బయటికొచ్చింది. "నాసోట్లో నాజా పేపండుకుంటున్నాను......ఇప్పుడు నువ్వు లేస్తావా? లేవ్వా?" అన్నాడు సమస్యా పరిష్కారానికి ఏదో మార్గం కనిపెట్టినట్లు: "లేవనని నీ కెన్నిసార్లు చెప్పాలోయ్?.. కావలంటే ఒకదెబ్బ చూసుకో" అని క్రోధావేశమూర్తియై పిడికిలిబిగించి, చెయ్యిపైకెత్తి గోషై అన్నాడు.

రెండవవ్యక్తి పోల్చిచూస్తే పొట్టిమనిషి. అతను చెయ్యిపైకెత్తగనే గుండెలాగినంత పనయింది. శరీరం కంపమెత్తింది, అయినా ధైర్యంచేసి "ఏమిటోయ్! కొత్త జరగవయ్యా! అంటే పెద్దవస్తాదులాగ మాటాడతావ్...ఎంతఉందిని కొడతావు నువ్వు?...అసలు నేనెవరో తెలుసా...జాగ్రత్త..." అంటూ తన గళ్ల లుంగీ సగానికిమడచి నడుంపై చుట్టుకున్నాడు. తరువాత చేతులు పైకి తీస్తున్నాడు.

ఇంతలో ఓటాక్సీ ఆ సత్రం ముందుగా దూసుకుపోయింది. అప్పుడా కారు దీపప్రకాంతులు ఒక్కక్షణం వాళ్ళమీద ప్రసరించి, ఆ దిమ్మెలనన్నిటినీ వరుసగా దాటిపోయాయి. ఆ కాంతిలో, రౌద్రమూర్తియై, విలయతాండవానికి సిద్ధమై పిడికిలు కరచిపట్టుకున్న మొదటివ్యక్తి ముఖాన్ని రెండవవ్యక్తి సుస్పష్టంగా చూశాడు. నరాలు పెల్లుబికి, శరీరకష్టం స్ఫురింపచేసే అతని దృఢకాయం, రెండవవ్యక్తిలో గత స్మృతులను తట్టిలేపింది. కాని ఇప్పుడా ఆలోచనకు తావులేదు. కాని ఆ స్మృతితో భయం ఉద్ధృతమైంది.

ఇద్దరూ ఆభంగిమలో నిల్చొని, ముష్టియుద్ధానికి సన్నద్ధులౌతూంటే, తక్కినవాళ్ళంతా నిష్పాక్షికంగా ఐక్యరాజ్యసమితి పర్యవేక్షకబృందంలా పరిశీలిస్తున్నారు. ఆ పరిస్థితులలో ఒక అంధుడుకలుగజేసికొని "ఏమయ్యా! ఈపోటు మీఇద్దరిలో పోరిది కాదు... రవ్వంత కునుకుతీసి పొద్దుటే పొయ్యేవాళ్ళ కెందుకీ కొట్లాట...ఆగుసుకోవటం" అని తీర్పు చెప్పారు. ఆ తీర్పులో జాలి, శాంతిప్రియత్వంకన్న "పోలీసుల భయం" ఎక్కువగా ప్రతిధ్వనించింది.

ఇంతలో మరోకారు ఆరోడ్డున వెళ్ళటంవల్ల, ఆ సత్రంలో మసిబొగ్గుతో గీయబడిన, పెద్దపులి పోలీసు, కోడిపుంజు, కత్తిసాముచేస్తున వీరులు — మొదలైన చిత్రాలు కన్పించాయి. పోలీసుబొమ్మ చూచి అందరికీ భయం వేసింది. వ్యాపంటే అందర్నీ వెళ్ళగొడ్తారని స్ఫురించగనే ఎవరితావులకు వారు వెళ్ళిపోయారు.

ఆ పెద్దపులిబొమ్మ జూచి కలవరపడ్డాడు రెండో వ్యక్తి. ప్రేక్షకబృందం రాజీనామా యివ్వటంతో పోరాటంలో పాల్గొంటూన్న అభ్యర్థులు వెంటనే, కాలిపోయిన గడ్డివాముల్లా క్రిందకొరిగి దూరంభారంగా చతికిలబడ్డారు.

* * * *

ఆ గళ్ళలుంగీవ్యక్తికి నిద్రపట్టలేదు. గతానికి సంబంధించిన ఎన్నోదృశ్యాలు మురికికుప్పపై ముసురుతున్న దోమల్లాగా కళ్ళముందు మెదలసాగాయి. ఏడు సంవత్సరాలక్రితం, తను ఒకబాలికమెడలో గొలుసు అపహరించిననేరానికి కారాగారశిక్ష విధించారు. అప్పుడు తనగదికి ఎదురుగానున్న గదిలో "వీరాస్వామి" అనే ఖైదీ వుంటూండేవాడు. హత్యానేరం ఆరోపింపబడి ఎలాగో మరణశిక్షతప్పి ఇరవై సంవత్సరాలు కారాగారవాసం అనుభవిస్తున్నాడు.

# గృహోన్ముఖుడు

ఆఖైదీ అజానుబాహుడు. ముగ్గురు మనుషుల పెట్టిన పనిచేసి, వార్డర్లుపోసే ఆ రాగిగంజి. పుడిశిలా పీల్చిపారేసి పశుకొని ఎనుబోతులా కుమ్మిపెట్టేవాడు. తోటిఖైదీలందరికీ అతనంటే భయం, అభిమానం. అస్తమానం అంధకారబంధురమైవున్న ఆకుహాలో పడి వుండేవాడు. సాయంత్రం, ఒకఅర్ధగంట సేపు ఖైదీలను శృంఖలాబద్ధులనుచేసి వాయుసేవనంకోసం బయటికి తోలేవారు. ఆ సమయంలో, ఖైదీలందరూ, వినోదంగా కబురు చెప్పుకొని సంతోషించేవారు. అప్పుడుకూడ అతను మౌనవ్రతం చాలించేవాడు కాదు. ఎప్పుడు విడిచి పెడతారనే తహతహ, విముక్తుడయ్యాక ఏమిచెయ్యాలనే భావాలూ ఉద్భవించేవి కావు నిరాశ, వ్యాకులత ప్రస్ఫుటమౌతూండేవి. నున్నగా గొరిగించబడిన బోడి తల, చాలీచాలని ఆగళ్ళవాక్కాటతో వికారంగా వుండేవాడు. ఒక్కమాటలో చెప్పాలంటే, అతను చేసిన అపరాధానికి శిక్ష అనుభవిస్తూన్నట్లు, పశ్చాత్తాప పడుతున్నట్లు కన్పించేవాడు కాదు. వెలుతురు కానీ, గాలికానీ ప్రవేశింప శక్యంకాని ఆ కారాగారానికి రారాజులా గంభీరంగా వుండేవాడు.

ఒకరోజు ఖైదీలందరూ, శృంఖలాలు గలగలమని రొదచేసికొంటూ గుట్టలు గుట్టలుగా చేరి చెవులుకొరుక్కుంటున్నారు. ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ చెప్పుకొని, ముఖాలు కందగడ్డలా పెట్టుకుంటున్నారు. కొందరు నానాబూతులు తిడుతున్నారు. ఆమాటలు వీరాస్వామిలో కొంతచైతన్యం కలుగజేసినాయి. అతనిమౌనముద్ర విదళితమైంది.

"ఆడవాళ్ళవార్డులో ఒక గర్భిణిస్త్రీని జెయిలరు బలంకొద్దీ తన్నాట్ట. ఆ అక్రమచర్యవలన, పిండం జారుకపోయి, ఆమె మరణించింది" ఇది అసలు జరిగిన సంగతి. ఆ ఘటననుగూర్చిన విశేషాలు మరీ మరీ తర్కించుకొనేలోగా, ఖైదీలు లోపలికెళ్ళవలసిన ఆవశ్యకతను సూచిస్తూ వార్డులో గంట వినిపించింది. వెంటనే వార్డెను వెళ్లటానికి హుకుం జారీచేశాడు సంకెళ్లు గలగలలాడించుకొంటూ, స్వపాదవిన్యాసంతో అబాట ధూళీధూసరితం చేసికొంటూ, ఎవడి 'ముంత' (గంజిత్రాగేబొచ్చె) వాడు తీసుకొని, చీకటి గదుల్లో జొరబడ్డారు.

పైఘటనను పురస్కరించుకొని రెండవరోజు వార్డులో చిన్నగల్లంతు జరిగింది. జైలరు వార్డెనులను వెంటనిడుకొని పర్యవేక్షిస్తున్నాడు. ప్రతిగదిలోకీ తొంగిచూచి తాళపుకప్ప లాగి చూస్తున్నాడు. వీరాస్వామిగదిలోకి చూసి "వీడివిషయం జాగ్రత్త...పొగరు పోతు...దగుడు దమాడు" అన్నాడు. అప్పుడతని పెదవిపైనున్న కోరమీసం, మరింత సొగసుగా నాట్యం చేసింది. "దయనుగూర్చి నువ్వయినా వాళ్ళకు చెప్పరా" అన్నాడు కోపం, అపహాస్యం, బాధ సమ్మిళితమైన గొంతుతో.. వీరాస్వామి

ఆమాటలతో జెయిలరు ముఖం నల్లబడిపోయింది. "ఏమిట్రా, రాస్కెల్! దయనుగూర్చి చెప్పాల్ట్రా నీకు" అంటూ లోపల ప్రవేశించి బెత్తంతో ఒక దెబ్బ కొట్టాడు. మళ్ళీ రెండో దెబ్బకొట్టటానికి చెయ్యి పైకెత్తాడు. కొట్టబొయ్యేసరికి, వీరాస్వామి అతని చెయ్యి లంకించుకొని క్రిందకు వంగతీశాడు. వంగతీసి, పందిమెడలా ఉబ్బిపోయిన అతని మెడపట్టుకొని రెండుమూడు నిముషాలసేపు కిక్కురు మనకుండా బంగా ఒత్తిపట్టి...అటూ ఇటూ గెంతుకుప్పిలు ఊగించి గది బయటికి త్రోశాడు. చేతులు రెండూ అడ్డంగా గొలుసుతో బిగివేసివున్నాయి కాని లేకపోతే ఈపాటి కా మెడ ఇంకింతలావున వాచిపొయ్యేది.

ఆ దృశ్యాన్ని తిలకిస్తూ వార్డెనులు ఇద్దరూ స్తంభించిపొయ్యారు. జెయిలరుకంటేముందువాళ్లిద్దరూ మూర్ఛపోయినట్లు కన్పించారు. జెయిలరు గదిబయట పడినవెంటనే వాళ్లు ఈప్రపంచంలో పడ్డారు. వెంటనే ఆఫీసరుగార్ని ఆదరా బాదరా లేవనెత్తారు. జెయిలరు లేచి మెడసర్దుకుంటూ "కాల్చిచంపేస్తా రేపు... పొగరుబోతు వెధవా—అసలు నీకు మరణశిక్ష విధించాల్సింది." అంటూ గది ఇవతల నిల్చొని వీరాస్వామి మూఖాన పెళ్ళు పెళ్ళున రెండుదెబ్బలు చరిచాడు.

దీనిని ఎదురుగదులలో వున్నవారు స్పష్టంగా చూశారు. చూడలేకపోయిన ఖైదీలు ధ్వనులనుబట్టి పరిస్థితి ఊహించుకున్నారు. వెంటనే హాస్యధ్వానాలు ప్రకటిస్తూ 'హో' అని నవ్వారు. ఆ నవ్వు భరించలేక జెయిలరు "షటప్" అన్నాడు రొప్పుకుంటూ. సీమపంది లాంటికళ్ళతో జైలుగదుల వాకిళ్ళన్నిటివేపూ ఒక చూపు విసిరాడు. క్షణంలో ఆ నవ్వు అంతర్ధానమైంది. జెయిలరు వెళ్ళిపొయ్యాక నలుమూలలనుండి, "భలే పని చేశావురా!" అంటూ అభినందనాలు వచ్చాయి.

రెండవరోజు, హత్యాప్రయత్నమని జెయిలరు చేసిన అభియోగం ఫలితంగా వీరాస్వామికి ఐదేళ్లు కారాగారవాసం పొడిగించబడింది. దానితోపాటుగా ముప్పయి కొరడా దెబ్బలు స్వీకరించాడు.

ఈసంఘటన ఇప్పుడా గళ్ళలుంగీ వ్యక్తికి స్మృతిపథంలో నిన్న జరిగినట్లు కన్పించింది. ఇప్పుడతనికొంత,

